శ్రీరస్తు.

# పదలోచన శతకము



[redacted]

శ్రీమద్విజయనగర [redacted] గాన విద్యా
విశారదులునగు బ్ర॥ పేరీ రామయ్యగారి శిష్యుండగు

బ్ర॥ ధమరశింగి గురాచార్యకవి విరచితము
కుంటినవలస, వి॥ జి॥

ఇంగిలాపల్యగ్రహార నివాసకులగు బ్ర॥ శ్రీ॥ నిష్ఠల
శింహాచలం శాస్త్రులుగారిచేఁ పరిశోధింపఁబడి

గంజాంజిల్లా నరసన్నపేట తాలూకా
కిల్లాం గ్రామం కాపురస్థులగు మ॥ రా॥ శ్రీ॥ శిమ్మ
సీతారామయ్య నాయుడుగారొనరించిన
ద్రవ్య సహాయ్యంబువలన
బ్రకటింపబడియె.

కాపీరైటు రిజిష్టర్డు] 1931. [వెల 0—2—6.

శా॥ శ్రీకిల్లాముపురిస్థ వీస్తూదంతుసం । నేవ్వ్యందు నార్యాళిచేఁ
లోకఖ్యాతి సమన్వితు[redacted]బుధా । లోకుండుఁ శ్రీపుత్రిత
ద్రాకారాంగ సముండుఁ శిమ్మకులశ్రీ । రాంభోనిధిక్ దీప్తుడై
రాకేందుండనఁ బర్వె శోడశకళ । నాగ్రమాఖ్యానాయుండిలన్॥

కం॥ ఆతని సత్పుత్రుఁడు ప్ర। ఖ్యాతి సమన్వితుఁడు ఘనుఁడ ।
గణ్యుఁడు సుగుణో। పేతుఁడు సత్యసమేతుఁడు। సీతారా
మయ్యానాయుఁ । డెలువొందె భువిన్॥

సీ॥ అతని సత్కార్యంబు । లలవిగా వునుతించి
బలుక నెవ్వరికైన । బడవు నోట
బీదసాధులకోరి । బిలిచి సత్కారణుడై
చిత్తముల్బొంగమే । జేసిబనుపు
దేవాలయంబుల్స్రి । ధిలమకాటఁగని గట్టి
బక్తుఁడై యాదేవు । భజన జేయు
ఉత్తము గుణశీలుఁ । డోదివిగాయకులాది
కవుల విద్వాంసులఁ । గౌరవించుఁ॥

గీ॥ అతిథి యభ్యాగతులకెల్ల । ననుదినంబుఁ
పోషకుండయిఁ సత్కీర్తిఁ । బొందుచున్న
యమలశిమ్మ సీతారామ । యాఖ్యనాయుఁ
డనఘుఁ డతిధీరుఁడెంతైన । నతుల గుణుఁడు॥

సీ॥ కమలా నిలయమైన । గంజాముడిస్ట్రిక్టు
సరసన్న పేట తా । లాయిలాక

తాలూక యేదీమెత । ద్దరినున్న కిల్లాము
గ్రామాధికారిసు । జ్ఞానమూర్తి
అమల సద్గుణ యుతుం డచ్చమాంబ సుదుండు
సుమసాయ కసమాన । సుందరుండుఁ
గానమున్ సాహిత్య । కవితాది విద్యల
న్సారాంశము లెరుంగు । చదురుఁ డతఁడు॥

ఆ॥ శిమ్మవంశజుంజు । శిరులసంపన్నుండు
నార్యవత్సలుండు । నతిఘనుండు
ధర్మవిదుండు సీ । తారామనాయుండు
భక్తితత్పరుండు । పావనుండు

సీ॥ మితిలేక వరులకు । న్మేలు జేయుటగాని
చేసి తిననిగొప్పఁ । జెప్పుకొనడు
భక్తిచే కైవల్య । పదవి వెదకుటగాని
జ్ఞానవర్తినటంచు । గర్వపడఁడు
సిరులు హెచ్చినఁ దైవ । సేవజేయుటగాని
విత్తముంగని విఱ్ఱఁ । వీగబోఁడు
కందర్పునెదిరించు । సుందరుండేగాని
పరవధూ కాంక్షకై । భ్రమతపడఁడు॥

గీ॥ యిన్నియుత్తమ సుగుణంబు । లిమిడియుండి
పుడమినద్వేలమ కులమలదుఁ । బుట్టియున్న
ధీయుతుఁడు సీతారామ । నాయుసాటి
మనుజుఁడేడింక నీలోక । మందుఁమేటి॥

సీ॥ ధరకర్ణుఁడడిగినం । దానమిచ్చెనుగాని
గొంకక నీతండు । కోరియిచ్చు
సత్యభాషకు హరి । శ్చంద్రుఁ డేమోగాని
యితనాడి తప్పుట । కిష్టపడడు
నలసార్వభౌముఁడే । నాటిశాంతుఁడొగాని
యితని శాంతమునకెం । దీడులేదు
గుణవంతుడట దేవఁ । గురుఁడ దేమోగాని
యితని సద్గుణమిప్పుఁ । డిలనులేదు॥

గీ॥ దానమును సత్యసుగుణశాం । తములవలన
ఘనతనొందియు కిల్లాము । గ్రామమందు
ధాముడగు సీతారామ । నామనాయుఁ
డనఘవర్తనుఁ డార్యుండు । నమితయశుఁడు॥

సీ॥ యిరుగు పొరుగులనున్న । యితర నాయులఁగాంచి
మధ్యపానాదుల । న్మరుగబోడు
కోటివేలధనంబుఁ । గూడివచ్చినను దు
ర్వ్యసనాంశమన్ననా । వైపుజనఁడు
అధికారిసని తుల్లి, । యన్యాయమొడిగట్టి
దీనులంబట్టి భా । ధించబోడు
బీదసత్కారణాకై । మోసమొందునుగాని
గసిరి పొమ్మను మనో । గర్విగాడు॥

ఆ॥ కలిమింటగలవాడు । ఘనుడు పేదలరేడు
బుధజనుండిట్టిడీ । భువినిలేఁడు

తగుతగు శిమ్మ సీ । తారామనాయుండు
సుగుణాబ్ధియనగాఁవ । సుంధరమున॥

సీ॥ అడుగకన్నుమదీని । యచ్చునక్షైకోరి
దర్విమిచ్చిన యశో । ధనుఁడితండు
సదయుడై పిదపమా । సకుటుంబ పరివార
పోషకుండైన స । త్పుణ్యుఁడితడు
తర్వాతమరియునా । తలపెరింగియుగొన్ని
బహుమతులిడిన స । త్ప్రభువితండు
సన్నొకర్కరునిగాక । నఖిలపార్రిణులనొక్క
పగిదిఁభావించు సం । భావుఁడితడు॥

ఆ॥ శిమ్మవంశజుండు । శేముషీసింధుండుఁ
పరమ భక్తుఁడుజగ । త్ప్రకటుండు
తగుతగుండగును సీ । తారామనాయుండు
దాతయనంగఁ భూ । తలమునందు॥

చ॥ అతిధి యనాధి సాధుజన । యాచక కోవిదులాదివారి స
మ్మతముతెరింగియర్ధముగ।మన్ననబ్రోచెడిదాతయంచుబ
ల్లుతుకమునొంది గొబ్బునను । కోరికతోఁజను దెంచిసర్వదా
యితనికి పద్మలోచనుఁడు।యీప్సితముల్దయ నేసిబ్రోవుతన్॥

మహారాజశ్రీ శిమ్మ సీతారామయ్య నాయుడుగారి
"వంశావళి పద్యములు" సంపూర్ణము.

ఇట్లు వీరియాశ్రితుండగు
"ధమనిశింగి గురాచార్యకవి"

# పద్మలోచనశతకము

## ప్రారంభము.

ఉ॥ శ్రీరమణీమణీ విమల । చిత్తసుధారసపాన భృంగశృం
గార సహస్రమార గుణ । గణ్య భవాటవివీతిహోత్రవి
స్తారమునీంద్ర భక్తముఖ । సారసభాస్కర దైత్యదంతికం
ఠీరవరాజ గోపకులఁ । డింభకసుస్ఫుట పద్మలోచనా॥ 1

ఉ॥ కాంచన చేలనీదు పద । కంజములన్మదిలోన నిల్పి పూ
రించెడి పల్కువేకుసుమ । రీతిఁదలంచియు ననుబ్రోచి ర
క్షించుమురారి సూరిజన । సేవితదీనుఁడనయ్య నన్ను పే
క్షించుట బాడిగాదు సర । సీరుహనాభిక॥ప॥ 2

చ॥ అతిమధురంబులౌ ఫలము । లర్పణజేసి సుగంధలేపనా
మితముగ నిన్నలందిఘన । మేచకగాత్రతరింపవేడనా
బ్రతుకన నెంతనీచుఁడను । పామరుఁడన్దయజూచిబ్రోవుమా
సతతముఁ నిన్ను వేడెదను । సజ్జనపాలక॥ప॥ 3

ఉ॥ ఆ[illegible]యు పంచకావ్యములఁ । నానిపఠించుటఁ లేదుశాస్త్రము
లొక్కరిక నేర్పలేదు యదు । కుంజరనీపద చింతనామృతా
సారము నాదుహృత్కమల । సంగడిగూడిగ నిత్యమబ్బెనే
ర్పారుటగాదు నిన్నిటులఁ । బల్కుచువ్రాయుట॥ప॥ 4

చ॥ మతమునదోచినట్లుయొక । మాటకుమాటిడిచంపకోత్పలాల్
శతకము మాలఁగూర్చికడు । సంతసమొందగఁ పూజచేసినీ
కుతుకమువైచి బ్రోవుమని । కోరెదనోహరి నీకు తక్కనే
నితరులఁ వేడ నింకజగ । దీశదయానిధి॥ప॥ 5

ఉ॥ శ్రీరమణీయమూర్ధమరఁ । శింగివరాన్వయ బుచ్చిలింగకొ
మారుఁడ విశ్వకర్మకుల । మందు జనించినవాఁడఁ నేగురా
చారిసమాఖ్యుఁడ స్తవవి । శాలపదంబుల కంకితంబుగాఁ
గాఁరచియించ బూనితిని । గైకొని బ్రోవుము॥ప॥ 6

చ॥ భవహరులైన పుణ్యులకుఁ । పండితవర్యులుఁ భక్తులైనమా
నవులకుఁ కాళిదాసకవి । నాయక పోతన భాస్కరాదిస
త్కవులకుఁనీకుఁమద్రచిత । కావ్యఫలంబుకుమ్రొక్కిమ్రొక్కుచున్
భువిని శిరంబు జేరనిడి । పూజలు జేసెద॥ప॥ 7

ఉ॥ సుందరరూపనీహరాయలు । జూచి పదారగువేల గోపికల్
పొందునజేరి బ్రోవుమని । బొబ్బలుబెట్టి నుతించివేడ వా
రందరుఁగాకఁ రుక్మిణియుఁ । రాధసుదంతియుఁమిత్రవిందనా
నందముతోడఁ బ్రోచితివి । నందకుమారక॥ప॥ 8

చ॥ శివుఁడవటంచుఁ కొందరును । శ్రీహరిమూర్తివటంచుఁ కొందరున్
భువినిటు బల్కుచుండెదరు । బుద్ధినిజూడఁసురేశనీవుఁమా
నవులను మాయగల్పిఁటుల । నాడదలంచుట చేతఁగాని కే
శవుఁడ శివుండవీవెమది । సందియమేటికి॥ప॥ 9

ఉ॥ సంగర భీమమానిసుర । సన్నుత నామసుధాబ్ధిమామమా
తంగమనోభిరామ వర । దాయక గోపకులాబ్ధి సోమరూ
పాంగవిలాసకామ వర । పండితధామ మణీలలామ నా
కుంగతి నీదుప్రేమయదు । కుంజరబ్రోవుము॥ప॥ 10

ఉ॥ కోరికవస్త్రముల్విడిచి । గోకులకాంతలు స్నానమాడగాఁ
వారికిఁ గానరాకతను । వద్దను దాగియు కట్టుకోకల

నోచ్చరతనంబు జేసితిని । చోద్యమునీ కథలెన్నివిన్ననా
నోరున(నీ చరిత్రములు । నుడ్వుట శక్యమ॥ప॥ 11

ఉ॥ మన్నుదినంగ( నిన్ను(గని । మాతయశోదసహించలేక(నిం
దిన్నగనుండ వేటికని । తీసుకముగ్గిడి నీదునోటనే
మున్నదిజూపుమన్న( నగి । మూడు(జగంబుల(జూపినావునీ
కన్నను పౌఢలెవ్వరిక( । గల్గుదురీభువి(॥ప॥ 12

ఉ॥ పల్లవపాణులిండ్ల(జని । పాలుపెరుంగును వెన్నమీగడల్
యుల్లముదీరమెక్కపయి । నున్నపయోఘృతభాండబంక్తికిం
జిల్లులువెట్టి యొక్కతెకు । చిక్క(క( చిక్కులుబెట్టయిట్లు(వే
పల్లెను సంచరించితివి । భక్తజనావన॥ప॥ 13

ఉ॥ జూటరి నీకుమారు(డిటు । జూడుము చేసెనటంచు(గోపికా
బోటులనేకమందిట(ల( । బొబ్బలు( బెట్టగ నిన్ను దేవకీ
రోటనుగట్ట గట్టువడి । రోదన జేసితివీవు తల్లి మో
మాటము దప్పలేకనభి । మానము జూపు(ను॥ప॥ 14

చ॥ కడువడి వేడ్కతోడ(జని । గజ్జెలునందెలు ఘల్లుమ్రోయగ
న్నడుగున డిగ్గియిందునికి । మానుమటంచును జెప్పికాళియు
న్పడగలపైని శాస్త్రమగు । పద్ధతి(మీరక(నృత్యమాడునీ
యడుగుల( పూజజేసెదను । యాశ్రితవత్సల॥ప॥ 15

చ॥ ధరధరనీలదేహవర । దామునిఖే చరసిద్ధసాధ్యకి
న్నర గరు(డాది కింపురుష । నాగసురాసురమానవాదివా
నరులును నీకుకీ్రందుగద । నారదగీదవిలోల శౌరియీ
ధరణిని నిన్ను( బోలదగు । దైవములేడిక॥ప॥ 16

ఉ॥ గోపనులేంద్రి గోపకుల । కుట్టలఁ గూడియు గోగణంబుల
న్నేపనరణ్య సీమజనఁ । మెండగు వర్షము వజ్రిసీపయిం
గోపమనస్కుడై గురియఁ । గోవులఁ గోపులఁగావగాగిరిం
గావుగఁ గేల నెత్తితివిఁ । కందుకమట్లుగ॥ప॥ 17

ఉ॥ క్రూరమతంపు కౌరవులు । కృష్ణుఁడ ద్రౌపతివస్త్రహీనముం
గారచియించఁదయూహగాన । గాఁగనిమానముమెల్లసీయకన్
చీరకుఁ జీరనిచ్చితివి । చిత్రము నీమహిమంబు లింకనా
భారమునీదె మానినను బ్రోచిన నిమ్యోదె॥ప॥ 18

ఉ॥ ఓపరమేశ లోకముల । నొక్కరచేతిని బంతులాడునీ
కేపని చేతకాదనుచు । నెంచుదుఁనన్ను దయారసంబుతో
నేపగిదిందరింపుమని । మెంచితిఁగోగనజాలఁగాని నా
పాపిక నీవె నమ్మితిని । భంజిత దానవ॥ప॥ 19

ఉ॥ యింత బలాధికుండవని । యింతకుమున్నగు నీదుభక్తులా
దంతివిభీషణుండు నల । ద్రౌపది కుంతి కుచేలుఁడాదిగాఁ
వింతగఁ దెల్పగాఁ వినియుఁ । వీనుల విందుగఁ సంతసించినా
స్వాంతమునందునిన్ను నుతిఁ । సల్పగఁ బూనితిఁ॥ప॥ 20

ఉ॥ దోసమటంచెరుంగకను । దుష్కృతినైతినిగాన భక్తవి
స్వాసకరోగి రుగ్మతిని । వైద్యుఁడునాశముజేయురీతిఁనా
దోసవినాశమున్సలిపి । దుర్జన సంగడిగూడనీకనీ
దాసులలోన నన్నొకనిఁ । దండిదలంచుము॥ప॥ 21

చ॥ ధనమదుగంగఁ లేదు నిను । దప్పికకై మొరపెట్టనీవునా
మనమునజిక్కియున్న బహు । మానమునాకదెనంతెగాకయా

ధనములఁ దల్లిదండ్రులును । దారసుతాదులఁ బంధువర్గముం
దనివిగలుంగఁ జేయుదుర । తండ్రిమురాంతక॥ప॥ 22

ఉ॥ పెంచిన నీవె దుర్గతుల । బెట్టిననీవె వరంబులిచ్చిపో
షించిననీవె లేక నను । శిక్షణ జేసిన నీవె బ్రోచి ర
క్షించిననీవె యన్యులకుఁ । జేయుట శక్యమ దేనికిన్విచా
రించను నన్ను నీదయఁత । రింపఁగఁ జేయుము॥ప॥ 23

చ॥ బుధజన సామజాదిసుర । పూజితపాద స్వరూపమన్మథా
కదళిక నారికేళవర । కంటకి జున్నుఁ మిఠాయికన్నఁబల్
మధురమునీచరిత్ర నర । మాత్రుఁడ నేనన నెంత తండ్రినీ
కథలు గణింపఁ నెవ్వరికి । గల్గును శక్యము॥ప॥ 24

ఉ॥ కంటికి గానరావు గద । కష్టసుఖంబులు జెప్పుకొంటకై
కొంటెతనంబు జేసియట । కోఁనిరావికనుండుమయ్య వై
కుంఠముజొచ్చి నీపదము । గూడుకయుండెద నెల్లవేళలం
గంటినటంచు సంతసముఁ । గల్గమనంబునఁ॥ప॥ 25

చ॥కురులెగఁదువ్వి చేతనొక । కొంగుధరించియుఁ చేరుమాలుయుం
దిరుమణిఁ నొష్టదిద్ది బహు । దివ్యస్వరూపుడనంచుపోకిరీ
తిరుగులు దిర్గినీభజన । తీపునెరుంగకఁ మూఢమానవుల్
నరకము ప్రాప్తమొందఁనిను । నమ్మిదలంచరు॥ప॥ 26

ఉ॥ కల్లునురంబుఁ ద్రావికను । గానకఁ పాపులు చెల్లెలక్కలన్
తల్లుల నన్నదమ్ములను । దారుణభాషలుబల్కి పోర్లుచు
న్వొల్లునెరుంగలేక భవ । మొందియుఁ దుర్గతికేగువారుని
న్నుల్లమునందుఁ యొక్కక్షణ । మోపికఁ గొల్వరు॥ప॥ 27

ఉ॥ వేకలనాడు కొంచునిరు • వేదల జూడక ముష్కరాళియి
స్తూకుఁ గళావరాసుయిది • జోకరుజాకి మణేలయుంచుచేఁ
రూకలఁ ఖర్చు బోవుచును • రూఢి నెరుంగకఁ గొట్టులాడుచున్
లోకులు కొందరిట్లు మది • లోనిను గొల్వరు॥ప॥ 28

ఉ॥ కామమదాంధు లల్పులును • కల్మషచిత్తులుఁ బుద్ధిహీనులు
న్నేనముదప్పనారలును • నీచులుఁ గొంటెలుఁ నిండ కల్మష
తామసబుద్ధులు స్థలులుఁ • తస్కరవర్తులు ముష్కరాళియా
భూమిని పూజ్యులైరి సుర • పూజిత చిత్రము॥ప॥ 29

చ॥ మదమత్తుడైన చంచలతఁ • మానసకల్మషుఁడైన జారుఁడై
సుదతులఁ గొంచ బోయినను • జూదరియైనను వాదమాడినం
జదువరిగాకఁ బోయినను • సత్యధురీణత లేకపోయి నీ
పదభజనంబు చేయునెడ • పావనుఁడౌగద॥ప॥ 30

చ॥ కరుణవహించినన్ను కని • కాంము తోడుతఁ బ్రోవకున్న నే
తరిని తరింతుఁ చక్రధర • తాపసవర్తి నత్పన్మవేదినా
నరుఁడను మూఢచిత్తుఁడను • నాతరమా నుతిసేయ నిన్ను వే
శిరముల శేషుఁడైనఁ నుతి • సేయగజాలునె॥ప॥ 31

చ॥ సుజనజనావనా వినుము • సూర్యసుతుండు నసంఖ్యమొందనా
మజభట ఘోటకాలబహు • మాన మొసంగగఁ జక్రవర్తినా
కుజనుఁడఁ క్రూరచిత్తుఁడను • కోపమనస్కుఁడనైన నాకు నీ
భజనము కన్న వేరయిన • భాగ్యము లేదిక॥ప॥ 32

చ॥ కఫమును వాతపిత్తములు • గ్రమ్మకవచ్చిన వేళలన్మనో
చపలతగల్గి నీభజన • సల్పుట దోచునో దోచదో గదా

తపసులఁ రక్షనీకిపుడెఁ ♦ దండముదండముఁ దండమయ్యనీ
కృపనుదలంచి బ్రోవుమను ♦ కీర్తివిశాలక॥ప॥ 33

చ॥ మరణ సమీపమందునిను ♦ మానసమందిడనీక రోగము
ల్మరుపును జెందజేయుఁమతి ♦ మంతునకై ననుఁగాక కాలకిం
కరులికరమ్ము రమ్మనుచుఁ ♦ గాఢకుఠారముద్రిప్పుచుండనా
తరినను యెట్లు బ్రోచెదవొ ♦ తండ్రిగజావన॥ప॥ 34

ఉ॥ శక్తికొలంది నీభజన ♦ సల్పుడెగాని మరెట్టి కర్మలా
సక్తిఁగలుంగఁలేదు భవ ♦ సన్నుతపాదయుగాబ్జ పృథ్వినీ
భక్తికిఁ మించియున్నబహు ♦ భాగ్యములేవికఁనెట్టులైనను
న్ముక్తిఁయొసంగిబ్రోవుమికఁ ♦ మూలము దెల్పితి॥ప॥ 35

ఉ॥ వాలికిఁ సూర్యపుత్రుఁడును ♦ వారణరాజలగ్రాహమూర్తికిం
జాలకఁ నిన్ను వేడుకొనఁ ♦ సాధుజనావనవాలి నక్రముం
గోలనుగూర్చి వారిమది ♦ కోర్కెలు దీర్చితి వట్లుగాఁగఁన
న్కాలుఁడు బాధజేయఁగని ♦ ఖండన జేయుము॥ప॥ 36

ఉ॥ కుచ్చుగసోమకాసురుఁడు ♦ కోపరసంబున నాల్గువేదముల్
మృచ్చిలివార్ధిలోసఁయొక ♦ మూలనుడాగగఁ మచ్చరూపమై
జచ్చిపడంగగొట్టిశ్రుతి ♦ సంఘముదెచ్చియుబ్రహ్మకిచ్చితౌ
మెచ్చగఁనచ్చులోకములఁ ♦ మేటివటంచును॥ప॥ 37

చ॥ సురగణదైత్యరాశి మధు ♦ సూదనవారిధి దర్వబూనిమం
దరగిరిఁ దెచ్చి గవ్వముగఁ ♦ దాడునసంతుని జేసి దర్వసా
గరమున శైలమున్మునుగఁ ♦ గాంచి బలంబునదాని తెత్తగా
విరివగు కూర్మరూపమయి ♦ వీపున నెత్తితొ॥ప॥ 38

చ॥ దనుజుఁడొకండుభూతలము◆తల్లడమొందఁగఁజుట్టచుండఁగాఁ
సునిసితసాయకంబునకుఁ◆జోడుగఁబోల్పఁదుదంష్ట్రతోడుతన్
ఘన వరహావతారమున ◆ కాంచన నేత్రునిఁద్రుంచినావుని
న్నని నెవరోపుఁ ముజ్జగము ◆ లందుమహాత్మక॥ప॥ 39

చ॥ చిరుతఁడుఁ నీదు భక్తులలో ◆ శేఖరుఁడౌ ప్రహ్లాదుస్సైనిదు
శ్చరితుఁడు హేమకశ్యపుఁడు◆శాత్రవుఁడైనుతుఁ బాధపెట్టగా
నరహరి రూపివై దనుజ ◆ నాథుని చించివధించితీవునీ
సరియగు శక్తి ధైర్యములఁ ◆ సాహసులెవ్వలు॥ప॥ 40

చ॥ వటుగునిరూపివైధవళ◆వస్త్రములున్బడిచెంబువూంజియున్
గొడుగునుచేతశాస్త్రములు◆గుజ్జుస్వరూపముఁదాల్చివెళ్లిమూఁ
డడుగులభూమినీవడుగఁ◆యాతఁడుయీరానభూనభంబు రెం
డడుగులు వైచి యాబలిని ◆ యంతముజేసిన॥ప॥ 41

చ॥ యిరువదియొక్కమారునృప ◆తీశుశిరంబులఁద్రుంచిమెట్టులే
ర్పరచితొ స్వర్గసీమలకు ◆ భార్గవరాముఁడ కార్తవీర్యుని
న్దురమునద్రుంచినావుభవ ◆ దూరనమస్కృతినీకునిన్నునేఁ
మరువక భక్తిజేసెదను ◆ మానసమందున॥ప॥ 42

చ॥ కుశలముమీర తాపసుల ◆ కోర్కెలు దీర్చఁగ దైత్యరాశినీ
యశనిసమాన బాణముల ◆ నంతముజేసియురావణాసురు
న్మశకముఁరీతిఁ జంపితివి ◆ మానవజన్ముఁడవైననిన్నయో
దశరథరాజపుత్రవర ◆ దాయక వేడెద॥ప॥ 43

ఉ॥ కంసుడునిన్నుద్రుంచుటకుఁ ◆ కక్షవహించియశోదనందులఁ
న్హింసలుబెట్టగాఁగనిస ◆ హించగఁలేకఁహాలాయుధుండవై

ధ్వంసము జేసినీవు తలి ♦ దండ్రులబాధలు దీర్చినావుయో
కంసమురారి బ్రోవుకని ♦ కారముతోఁనను॥ప॥ 44

చ॥ యిద్ధరలోన బౌద్ధమత ♦ మేర్పడినందునఁ లోకమెల్లఁసం
రుద్ధముఁగల్లునంచుమదిఁ♦రూఢిదలంచియుఁదుర్మదాళులన్
రద్దుగఁజేసిపిమ్మటఁది ♦ రంబగు వైష్ణవ సేవ్యమిచ్చియా
బుద్ధమతంబు ఖండనకుఁ ♦ బుట్టితివీయిల॥ప॥ 45

ఉ॥ బాహుబలాఢ్యదుర్జవి ♦ భంజన దైత్యగణంబు నెల్లఁస
మ్మోహముఁజేసిదైవతస♦మూహమునందమృతంబుబంచియున్
మోహితులైనరాక్షసస ♦ మూహముఁలోఁబఁడునట్లుగాజగ
న్మోహినివైన నీమహిమఁ ♦ బోల్పగఁశక్యమ॥ప॥ 46

ఉ॥ తోయజముల్ భవన్నయన ♦ దోన్నతసంపద నందగోరిపా
నీయమునందపంబుగొని ♦ నేటికినున్న వికంధరంబునీ [తా
కాయముతోఁసమానమగు♦కాంతివహించగకొండబట్టెఁ
జేయునుకంబుకంధరవి ♦ శేషముగోరుచుఁ॥ప॥ 47

ఉ॥ అన్నమునీరుద్రావకను♦యాత్మనుబాధలుబెట్టిలేశము
న్నిన్ను దలంచకున్నకడు ♦ నిష్ఠవ్రతంబుపవాసమున్న నే
మున్నదిముక్తిమూఢులకుఁ♦మోదముతోఁడుతనీపదాబ్జముల్
సన్నుతిఁజేయఁకున్నఁ నివి ♦ సల్పుటదేటికి॥ప॥ 48

ఉ॥ కాశికిఁ బోవలేదు కని ♦ కావముతోఁడుతఁడానధర్మముం
జేసినవాఁడగాను జప ♦ సేవనమంత్రముఁ నిష్ఠనీమమే
కాశివ్రతంబులేదునను ♦ గాచినఁబూనినఁబొంకఁనిత్యముం
బాసుడనంచుఁ నిన్నుమదిఁ ♦ దల్చుట నిక్కము॥ప॥ 49

ఉ॥ ముచ్చటదీరఁ భార్యధన ♦ పుత్త్రులనిస్తివిహాంబుఁజూడగాఁ
ఫుచ్చినదైన వెంటనొక ♦ పోకరుదెంచదు పాపపుణ్యముల్
జచ్చినవానివెంటజని ♦ సాక్షముబల్కునుయీషణత్త్రియం
పిచ్చితనంబు లోకులకుఁ ♦ బెట్టితివక్కట॥ప॥ 50

ఉ॥ మక్కువఁపామరాళిమతి♦యాలియుఁశోశనగాయడొక్కలోఁ
జిక్కినకీటకంబుతెరి ♦ చిక్కులనొందుచుఁ జచ్చిపుట్టుచున్
యెక్కినకొమ్మగొట్టుకొని♦ యెన్నియొబాధలనొందుగానిని
న్నక్కట యొక్కమారుమన ♦ మందుదలంచరు॥ప॥ 51

ఉ॥ కప్పనుపాముబట్టుకొని ♦ కంఠగతింబడఁ మ్రింగజూఁడగాఁ
నప్పుఁడు కప్పయీఁగలకుఁ ♦ నాలుకచాచినరీతిఁమానవుల్
ముప్పునజెందికాఁగలుఁగు ♦ మోసమెరుంగఁగఁలేక నెన్నియో
నొప్పులు బొందుగానినిను ♦ నోటస్మరించరు॥ప॥ 52

ఉ॥ మిక్కిలిభాగ్యభోగములుఁ ♦ మేడలుఁమిద్దెలుగోగణంబులుం
జక్కని భార్యపుత్త్రులును ♦ సంగడివర్తులుఁ సర్వసంపదల్
తక్కిటఁదూచి చూచినను ♦ తక్కువ నీపదభక్తికన్ననీ
తక్కినవన్ని నిష్ఫలము ♦ తండ్రిసులార్చిత॥ప॥ 53

ఉ॥ భక్తియెసర్వరోగములఁ ♦ బాపి సుఖంబునుగల్గఁజేయునీ
భక్తియెపాపకర్మములఁ ♦ బారగదోలి తరింపజేయునీ
భక్తియెమూలకారణము ♦ బ్రహ్మసురేంద్రులకైనరక్షణా
సక్తిని భక్తిమ్రొక్కుదను ♦ సత్వరగైకొను॥ప॥ 54

చ॥ కరువలియగ్నినీవు యుద ♦ కంబులుఁనీవుసమస్తదిక్కులన్
గిరులచరాచరంబులను ♦ క్రిందను మీఁదట నంతరాళమే

మరుగులఁజూడనీవెయను • మానమదేటికిఁ నీవులేనిచోఁ
కరిమొరనాలకించి త్వరఁ • గాచితి వెట్టుల॥ప॥ 55

ఉ॥ ఫుల్లసరోజనాభ సుర • పూజితపాద జగత్త్రయంబునం
జల్లను వెన్నడాగుకొను • చందము నిండిననీస్వరూపముఁ గ్
పిల్లనుజూచిగృద్ధ్రు భ్రమ • పెట్టిన కై వడిజూడఁబోవఁనా
వల్లగుటెట్లుదీనుఁడను • వారణరక్షణ॥ప॥ 56

ఉ॥ కోటిధనంబుఁ గల్గినను • కూటికె దేహము నెంతపెంచినం
గాటికెనిష్ఫలంబుకల • కాలమునుండదు పాపజన్మము
న్నీటినిబుట్టు బుగ్గవలెఁ • నిత్యముగానిది దీనితోఁడనీ
బూటకమేలఁనాకు నిను • పూజలుచేసెద॥ప॥ 57

ఉ॥ తుంబుర నారదాదులకు • తుల్యుఁడనానిను తాళనృత్యగా
నంబులఁ మెప్పుజేయ కపి • నాథుఁడనాతగు బంటునిచ్చిన
ఖ్యంబొదవంగచేయుటకు • గణ్యుఁడగానికె నెందుదీనుఁడన్
యంబుజనాభ నీవెగతి • యంచుఁ దలంచితి॥ప॥ 58

ఉ॥ ఖండితభక్తిచేసినిను • గన్గొనఁ కాంచన కశ్యపాఖ్యపు
త్రుండనుగానులేకఁ విదు • రుండు కుచేలుఁడగానుగానుని
చుండను సర్వకార్యములఁ • సూన్యపరాక్రమమైనశక్తిహీ
నుండనుమానవాధమున • నుంగరుణించుము॥ప॥ 59

చ॥ అరమరలేల బ్రోచుటకు • యర్హునిగా నిరంతరంబునీ
చరణయుగంబుఁ వేడుకొన • జాలనసందియమేల బ్రోవుమా
కరివరుడాదిభక్తులను • గాంచితివంచుఁ జగత్త్రయంబునన్
బిరుదమదేల భక్తులయ • భీష్టము లీయక॥ప॥ 60

చ॥ నిరతముఁ నిన్ను వేడుటకుఁ • నిష్ఠవహించినవాఁడఁగాను నీ
పరమపవిత్రమౌ కథలు • పట్టిభజించెదు నాదునాలుకన్
దురితము లాడనీయకుము • దుర్జనసంగతిఁ గూడనీకనీ
మరుగుననుంచి బ్రోవునను • మారువచించక॥ప॥ 61

చ॥ అవనిని నీకథామృతము • నందుమహోత్సవములాలకించు నా
చెవులకుఁ దుర్జనావళులు • జేసెడితూల ప్రసంగవాక్యముల్
గవియఁగఁజొచ్చిసంగతియుఁ • గ్రక్కునఁ వానినణంచిబ్రోవుమో
భవహర శౌరి కేశవను • భాంగదయానిధి॥ప॥ 62

ఉ॥ కాముసమానరూపనిను • గన్గొను నాకనుదోయి నెప్పుడు
న్నేమము దప్పనీయకుము • నీచులుఁ గొండెలుఁ నింద్యులస్వదు
ర్భావినులాది సంచయము • పర్వములం బడనీకు మోపరం
ధామపరాత్పరా విపుల • దానవభంజన॥ప॥ 63

ఉ॥ దీనపరాయణా విపుల • దీక్షను నిన్ను నుతించు నామదిన్
పూనికనుండనీయకరి • ఫుల్మదమచ్చరలోభమోహమున్
మానసమందు నిన్నెడకఁ • మాయలు జేయును వాని ద్రుంచి సు
జ్ఞానము నిచ్చి బ్రోవుము • గజావన శ్రీవర॥ప॥ 64

ఉ॥ పక్షికులేంద్రవాహవర • పన్నగశాయి మురారి కేశవా
యక్షసురాది సన్నుతప • దాంబుజ యభ్రశరీరకాంత
దాక్షసవంశనాశనవి • రాజిత కీర్తికలాపనాకప్ర
త్యక్షతిక లోకదైవతవు • తండ్రిఖరాంతక॥ప॥ 65

ఉ॥ సంగరభీమ భీమబల • సన్నుత మౌని విలోలలోలహృ
న్మంగళ దేవతాపహిత • మౌని తరూపకలాపదీపనీ

యాంగసుధీర ధీరజన • తావన దైత్యవిరామరామయో
రంగ సుగంధ గంధగజ • రక్షకబోధ్రువుము॥ప॥ 66

ఉ॥ వారిజగర్భుసూతియగు । వానికిమాతయుఁ దానియత్త్రకుం
గూరిమిగల్గు సోదరుని । కోరిధరించిన వానిచేతఁనా
కారముడుల్గువానిజన । కావినునా మొర విస్తరించెదన్
ధీరుని జేసి బోధ్రువుననుఁ । దీక్ష వహించియుఁ॥ప॥ 67

ఉ॥ పన్నగశాయి పూతనవి । భంజనయభ్రశరీరదీనయా
పన్నశరణ్యసాధుజన । పాలనశీల దయాలవాలయో
పన్నగ శత్రుఁవాహమృదు । భాషిత భవ్యసుకీర్తిఁనిర్జితా
బ్జోత్పన్నతచంద్రికావితతి । భూషితమాపతి॥ప॥ 68

ఉ॥ విన్నపమయ్య నీకుఁ రిణ । వీర ననుందయ బోధవకున్న నే
తెన్నను గానరాదఖిల । దేవగణంబుల కేగిజూడనీ
కన్నను దైవమేడినను । గావుముగావుముగావుమయ్యయో
వెన్నుడనీకు దండములు । వేలుయొనర్చెదఁ॥ప॥ 69

ఉ॥ వెఱ్ఱిగనిన్ను బాడుచును । వేడుకతోడుతఁ నిన్ను గొల్తునీ
కట్టిస్వరూపమెప్పటికో । గాంచెదనోయనువాంఛతోడనా
బొట్టయునిండ నిన్నఖిల । పూజలుజేయుచుఁనీకథామృతం
జుత్రెద జుట్టుమంచుఁ దయజూడుము నన్నిక॥ప॥ 70

ఉ॥ తప్పకనిన్ను వేడెదను । తప్పి చరించిన వేళనాపయిం
దప్పువహింతువే మొఘన । తాపసివర్తినిఁగానటంచుముం
జెప్పుచు వేడుకొంటిగద । సేవలుఁ జేసినఁ జేయకున్న నే
చొప్పననైన బోధ్రచిదయఁ । జూడుము నన్నిక॥ప॥ 71

చ॥ జననమునొంది పిమ్మటను । జ్ఞప్తినినీపదభక్తిఁజేయుచేఁ
చనువుననిన్ను నేను పురు । షంబులఁ బల్కినఁ పాటిచేయక౯
తనయునిబ్రోచుతండ్రిగతిఁ । తాలిమినొందియుఁ బ్రోవుమయ్యనా
వినుతులనంగనెంతపృథి । వీధరవాహక॥ప॥ 72

చ॥ విదురుఁడదెంతవేడెను వి । భీషణుఁడేమితించెఁ ద్రౌపతీ
హృదయమునందుసన్నుతులు । హెచ్చుగఁజేసెనదీనులంచుబల్
సదయుఁడవై కృపామతిని । సాకివరంబులొసంగుగాకఁవే
విధములఁపూజలేలఁ నొక । వీసముజేయవు॥ప॥ 73

ఉ॥ మంచిఫలంబులంది యభి । మానముతోఁశబరింగణించిర
క్షించితి వద్కులందియుఁ కుచేలునిఁబోచితి వట్లుగాఁగఁనే
లంచములిచ్చివేడ సిరి । లావరిగానునిరంతరంబుఁ పూ
జించెదఁనిన్ను వేడుకొని । సేవలుజేయుచుఁ॥ప॥ 74

చ॥ కరుకగునాకురాయిగొని । కమ్మరిలోహములందుఁపూనిక౯
చరచరఁరాయగాఁనరుగు । చాద్పుననీపదభక్తిచేయుచు౯
హరిహరియంచునిన్నుగొని । యాడినమానసమందుపాపముల్
తరిగి నశించిపోవుఁ రణ । ధైర్యబలోన్నత॥ప॥ 75

ఉ॥ శిష్టజనావనావినుము । చేసినపాపము చెప్పుకొన్నచోఁ
దుష్టులనైనబోచెదవు । దోసమునెంచక నున్నయట్లుగాఁ
కష్టసుఖంబుఁనావలన । గల్గిన పాపము జెప్పుకొంటినీ
యిష్టమదెట్లు బోచినను । యీవెగటించకను॥ప॥ 76

ఉ॥ సామజరక్ష నీమధు ర । సంబగు నామము శ్రీలొసంగునీ
నామమె సర్వసంపదలుఁ । నాకపురీనిలయంబుఁ గాననీ

నామమె పాపనాశనముఁ । నామమెసర్వరుజాహారంబుఁనీ
నామముగొల్చు మానవుల । నామముగొల్చెదఁ॥ప॥ 77

ఉ॥ తాపసిరక్ష నీభజన । తప్పకఁ జేసెడివారి డెందముల్
మాపులనంధకారయుత । బంధురమైన గృహాంబులోపలన్
దీపికనెత్తినన్విఫుల । దీధితి నొందినరీతిఁ మానవుల్
పాపభయంబు లందొరిఁగి । పావనులౌదురు॥ప॥ 78

ఉ॥ ప్రాకటమైన దీపమిడి । ప్రాభవమొప్ప నెలుంగుఁజేసినం
జీకటి దానిక్రిందటనె । జేరివసించును యట్లుగాఁగనే
లోకులుప్రౌఢలై నమరిఁ । లోభములుండకఁపోవునిత్యము
న్నీకును దక్క దేవతము । నీందుర్లక్షైనను॥ప॥ 79

ఉ॥ మందమతుండ నే తెలివి । మాలినవానినిచంచలాత్ముడఁ
యెందుకుఁసాటిగాని బల । హీననరుండనుయీజగంబులో
నందరికన్నఁ నేనతి య । నాథునిగావునఁ గావుమయ్యవే
వందలు వందనంబులను । భక్తినిచేసెద॥ప॥ 80

ఉ॥ కామముచేతఁ గోపికలఁ । కక్షవహించుటచేతఁ కంసునిఁ
ప్రేమముచేతఁ పాండులనుఁ । భేదముచేఁశిశుపాలదంతభూ
స్వాములనేలినావు నను । సాధుజనావన బ్రోవవేమయో
కోమల నీలదేహానిను । కోరిభజించినఁ॥ప॥ 81

చ॥ నగధరపక్షపాతమయ । నాదరణాముఁరిపెంబనాపయిఁ
పగటిమలేకఁపూర్వకృత । పాపముఁదెల్పుగదయ్యనాపయి
న్నెగటుగఁ జూడనేమిపని । వేడుచుఁనీపదభక్తిసంయుతం
బగుననుబ్రోవవేమిటికి । భారమపావన॥ప॥ 82

ఉ॥ నవ్వరయా త్రిలోకజన । నాయకులెల్లరుఁ నిన్వరంబునా
కివ్వనిపక్షమందు నుతి । యింతుర నీకుయవేద్య ధర్మముల్
యెవ్వియుఁలేవుగానఁవర । మీయుముగాదననిన్ను కాల్గదల్
నివ్వను జుమ్ముమీద నను । నిష్టురమాడినఁ॥ప॥ 83

చ॥ పగగొనియిట్లు నాపయిని । పంతములాడెద వేమిపోనిలే
నగధరుఁడిట్లుగాఁ గనుయ । నాదరణంబొనరించెనంచు నే
తగవులనైన బెట్టకడు । దండి వరంబుల నంది సేవకుం
డగుదునుగాని నిన్వదల । నయ్యరమావర॥ప॥ 84

ఉ॥ బత్తునిగానటంచు పర । భావమనీవర భక్తకోటిలో
మొత్తము గూడగాఁదగని । మూర్ఖుఁడనంచున లేకపో తెనీ
మత్తుతనంబుజూపుకొని । మారువచించక నన్నుఁజూఁడఁక
న్నొత్తవ నేనుజేయు పెను । నేరములేమిటి॥ప॥ 85

ఉ॥ ప్రాణము నొచ్చినట్లునిను । ప్రార్థనజేసినఁపల్కవేమయా
న్యాయనమయూరకుండుట వి । నోదమలేకను నీమనంబుపా
షాణపుగట్టిమైకరుగఁ । జాలదయేమని వన్నవింతునే
షూణతలేదునన్ను దయఁ । జూడుమునీవికఁ॥ప॥ 86

ఉ॥ వెన్ననుదొంగిలించుకొని । వేశ్యముగాకఁచరించయూరిలోఁ
గన్నియలెల్ల నిన్నెటులఁ । గైకొనిబట్టిరొయట్లుగాఁగఁ నే
నెన్నటికైననిన్ను భజి । యించుమహత్వము నెయ్యుపాయమో
బన్నియు నీపదద్వయముఁ । బట్టకమానను॥ప॥ 87

ఉ॥ కోరికుచేల ముఖ్యులనుఁ । గొబ్బునబ్రోచితివట్లదుండగాఁ
క్రూరచరిత్రు దైవత వి । రోధిని తమ్మునిబ్రోచినేనుయే

నేరము జేసితింబలుకఁ । నేరవుదెల్పుము నన్నుబ్రోచుటే
భారమనీకు యీభువిని । పాపభయంకర॥ప॥ 88

చ॥ భయహరపాపనాశనుఁడ । వంచునుభక్తులయందుసద్దయా
మయుఁడవటంచువేడిబ్రతి । మాలితిఁగానికఁనన్నుబ్రోలిని
ర్దయుఁడవుకర్మఘుండవున । ధర్మమనస్కుఁడవైతె నిన్నునే
దయగనుమాయటంచు । మదిఁ । దల్చుట దేటికి॥ప॥ 89

ఉ॥ వారిజనాభ ద్రౌపతికిఁ । వల్వలొసంగియుఁబ్రోచినావు వే
మారుపిర్యంబుచేఁ రవికు ♦ మారునిపట్టము గట్టినావునేఁ
కోరిభజించి సందులకుఁ । కూలియునైనను ముట్టజెప్పవీ
తీరునఁ ధర్మమయ్య నను । త్రిప్పలఁబెట్టుట॥ప॥ 90

ఉ॥ ప్రీతిగఁ నాబరాతమును । ప్రేమనొసంగుమ దేమిటన్ననా
తాతలుఁ తండ్రులెల్లరును । తాపసవర్తనులై చరించినీ
దూతలెనైమెరిగానఁ నను । దూరముజేయకఁ నీకచీరిబం
టొత్రునిగాఁగఁజేసుకొని । రూఢిగనేలుము॥ప॥ 91

ఉ॥ చేతినివెన్నబట్టుకొని । చిచ్చు నమర్చుట నేర్పులేమిచేఁ
నేతికి దిర్గుచుండిగన నేరకఁ మూఢులుఁ నీచులల్పులుల్
యాతురతం జరించెదర । యానినుగానకఁ సర్వదానసం
దాతవునీవయుండవర । దాకొడ వేటికి॥ప॥ 92

ఉ॥ నీడలు వెంబడించుగతిఁ । నేరకఁ జేరిన పాపకర్మముల్
తోడనె వచ్చుగాని యెటుదోచినఁబోవున పోవుడెట్లనన్
వేడుకతోడఁ నిన్మదిని । వేడినుతించెడి వారలెల్లరుం
గీడుఁ దొలంగి యీభువిని । కీర్తివహింతురు॥ప॥ 93

ఉ॥ కోటిధనంబు నిమ్మనుచుఁ । గోరుటలేదు మరేమిటైననుం
బాటిదలంచఁ నీకెరుక । పారనిదేదిక నెన్నియుంజగ
న్నాటక బొమ్మలాటలివి । నమ్మదునామదనీవునాకుఁమో
మాటము జూపఁజాలు నభి । మానము జూపుచుఁ॥ప॥ 94

చ॥ పరుషము బల్కినాడనని । పంతము బూనకుమెంత వేడినం
గరుగదు నీమనంబనుచుఁ । కారణమేమని కంటగించియీ
తెరిని భజింపసాగితిని । తప్పనియెంతువ కన్నతండ్రినీ
వెరుగనిదేది సర్వజగ । వేద్యుఁడవో హరి॥ప॥ 95

ఉ॥ ఒప్పులకుప్ప నాపలన । నుజ్వలదోషములొప్పియుండినన్
చప్పనినీరుఁ పాలునొక । సంగడిఁగూర్చగఁ నామరాళమా
చొప్పునెరింగినీరెటులఁ । చుక్కయుబీల్చకఁ పాలుద్రావుఁనా
తప్పులనన్నిగైకొనకఁ । ధన్యునిజేయుము॥ప॥ 96

ఉ॥ రూపమునందుమన్మథుని । రూఢిగఁదానమునందుకర్ణునిన్
దీపితతేజమందురవిఁ । దివ్యసుభోగములందు యింద్రునిఁ
లోపుగఁజేసుకొంటివికఁ । లోనగునెల్లరునీకుక్రిందయే
లోపమునీకుఁ సర్వజను । లుంగొనియాడగఁ॥ప॥ 97

చ॥ కనికరమొందినైననధి । కంబగుప్రేమదలంచినైననున్
వినయవిధేయుడంచుఁకడు । వేడుకతోడుతఁ నైననన్నుయే
చనువుననైన బ్రోతువని । సందియముంచకఁనమ్మినీకుఁనా
తనువునుదారబోసితిని । తండ్రియనాథుడఁ॥ప॥ 98

ఉ॥ కూరిమితోడఁ కానపులి । కూనలు సంచరలాడు చుండికా
ల్జారియుఁ బోనులోఁబడిన । చాడ్పుననీ పదభక్తిజేయుచే

సారసనాభ నీమృదుర । సంబగు నామమునాడు నాలుకన్
జేరెనికెందు బోయెదవు । జెప్పుము శ్రీహరి॥ప॥ 98

ఉ॥ దిక్కనులేదటంచుఁ గడు । దీనమతిన్ముకిళించి హస్తముల్
చెక్కనరాళ్లకెల్లఁ నుతి । జేయుట దేటికిఁ నిందలంచుచున్
మ్రొక్కనసీకు మ్రొక్కవలెఁ । ముక్తియొసంగిననీ వెయీగావలెం
దక్కనవారునీవలెను । దర్పితులెవ్వరు॥ప॥ 100

ఉ॥ పండితులెవ్వరీశతక । పద్యములంగని దీనిలోన బా
గుండని ప్రాసలుంగణము । లుండినఁ దిద్దదయారసంబు జూ
పుండని దెల్పుమయ్యకలి । పుంగవునై షడశాస్త్రవేదయు
క్తుండనుగాను భక్త । జన కుంజరసన్నుత॥ప॥ 101

ఉ॥ నందకుమార మారమణి । నాయకనాయక పూర్వదేవతా
బృందవిదూర దూరభవ । భీకర భీకర శతృభీమసం
క్రందన దేవదేవదర । కంధర కంధర నీలగాత్రగో
విందముకుంద ఛందగుణ । విస్ఫుట విస్ఫుట॥ప॥ 102

చ॥ సతమనిగాదుభాగ్యములు । చాలకఁగాదుమహాత్మభూమితో
బ్రతుకఁదలంచికాదుకడుఁ । భ్రాంతులఁజిక్కఁటఁ లేదునాదుసం
చితములఁబారదోలికడు । శీఘ్రముగాఁదయమోక్షదాయకా
మితములొసంగు తక్కనవి । మిధ్యలు సర్వముఁ॥ప॥ 103

చ॥ అనవరతంబుఁ నీమహిమ । లాత్మదలంచి నుతించిపద్మలో
చనశతకంబు పద్యములు । సంతతముంబఠియించిఁ వ్రాసిన
న్వినినవివేకము న్వరతిఁ । విశ్రుతభాగ్యములొందజేసియా
మనుజులనెల్లఁ నీవు మతి । మంతులఁజేతువు॥ప॥ 104

ఉ॥ మంగళమయ్య నీకిదిర ၊ మావరయాశ్రిత రక్షదీక్షకా
మంగళమయ్యనీకు వర ၊ మాని సురార్చితపాదపంకజా
మంగళమయ్య నందసుకు ၊ మారసహస్రవిభాకరప్రభా
మంగళమయ్య నీకు శుభ ၊ మంగళమోహరి॥ప॥ 105

శ్రీలక్ష్మీనారదాండ జానంతసమేత, శ్రీసత్యనారాయణ
పరబ్రహ్మ పదారవింద ధ్యానసంప్రాప్తకవితామాధురీ
ధురీణుండును, వీణాగాన ప్రశంసకుండును, ధమరశింగి
నామాంక విశ్వబ్రాహ్మణకులోద్భవ గురు లింగా
చార్యపౌత్రుండును, తద్గర్భాభి జనాబ్ధి సంజని
తేందు బుచ్చి లింగాచార్య పౌత్రుండును
అమ్మ నామాఖ్యాంబ సత్పుత్రుండును
సుబ్బారావాచార్యానుజన్ముండును
యగు గురాచార్యకవి విరచితం
బగు పద్మలోచన మకు
టాంచిత చంపకోత్పల
పద్య శతపంచక
సతకము.
సంపూర్ణము.

---

శ్రీ వేదవ్యాస ప్రెస్, విజయనగరము.